

# శ్రీ వేదాద్రి నారసింహ శతకము

బ్రహ్మర్షి శ్రీ వేంకటదాసస్వామి

గోవిందసుందరపదాంబుజ మగ్నచిత్తో
మందాకినీతులిత మంజుళవాక్ర్పవృత్త్యా
లోకం సమస్తమకరోదవధూతపాపం
తం వేంకటాఖ్యగురుమాత్మనిభావయామః.

* * *

సంసార తాపానలదగ్ధభావా
స్సమాగతా యా వవలోక్యసద్యః
భవంతిబోధామృత సేకహృష్టా
స్తామేగతి ర్వేంకటదేశికాంఘ్రీ.

**శ్రీ వేదాద్రి నారసింహ శతకము**

బ్రహ్మర్షి శ్రీ వేంకటదాసు స్వామి

మొదటి ముద్రణ : 2017

కవరు డిజైన్ : మోహన్

ప్రాప్తిస్థానము :
శ్రీమాన్ పద్యాల గోపీచంద్రస్వామి
విశ్రాంత ఆంధ్రోపన్యాసకులు
నగరం, నగరం (మం), గుంటూరు జిల్లా
చరవాణి : 9989905800, 8500123615

ప్రింటింగ్ :
శ్రీశ్రీ ప్రింటర్స్
కారల్‌మార్క్స్ రోడ్డు, అరండల్‌పేట
విజయవాడ - 520 002
సెల్ : 9490634849

వెల : పారాయణ.

శ్రీరామ

**శ్రీమతేరామానుజాయనమః        శ్రీవేంకటగురుభ్యోనమః**

**శ్రీశ్రీనివాసగురుభ్యోనమః        శ్రీవిష్ణుదాసగురుభ్యోనమః**

వేదాద్రినారసింహ శతకావిర్భావము – నెఱవేర్చిన ప్రయోజనము

**యత్పదాంభోరుహధ్యాన విధ్వస్తా శేషకల్మషః**

**వస్తుతాముపయాతోహం వేంకటాఖ్యం నమామితమ్**

భక్తకవిశేఖరులైన మహర్షి శ్రీవేంకటదాసస్వామి వారాజన్మ వైష్ణవులు. కుటుంబసభ్యుల చేత శిష్యుల చేత వారు శ్రీ ఉద్దైవరుల అంశగా భావింపబడిరి. అందులకు వారిజీవితము నుండి ఎన్నియో నిదర్శనములు కానవచ్చినవి.

వారు గుంటూరు జిల్లా నేటినగరం మండలము లోని పూడివాడయను గ్రామమున తన 35వ ఏటనే శ్రీరాజ్యలక్ష్మీరుక్మిణీ సత్యభామ ఆంజనేయసహిత శ్రీవేణుగోపాలస్వామి దేవాలయము నిర్మింపజేసి స్వామిని ప్రతిష్ఠించిరి. పెక్కుమందికి పంచసంస్కారములుచేసిరి. శిష్యసంఘమునకు శ్రీభాష్యకారసమాజమని పేరిడిరి. నిరంతరము శిష్యులకు భారతభాగవత రామాయణాది పురాణములను, శ్రీమద్భగవద్గీత ఆచార్య ఆళ్వారుల చరిత్రలను బోధించి బద్ధసంసారులను ముక్తిమార్గమును పట్టించిరి. వారికి పండితులైన నలుగురుకుమారులు ఇరువురు కుమార్తెలు కలిగిరి. వైష్ణవసిద్ధాంతప్రతిపాదకముగా వారనేక గ్రంథములు రచించిరి. అందులో వేదాద్రినారసింహశతకమొకటి.

ఈ గ్రంథరచనకు ముఖ్య కారణమేమనగా, తర్క వేదాంతవిశారదులు, కవిభట్టారక బిరుద విభ్రాజితులునగు వారి మూడవకుమారుడు శ్రీదాశరథీసూరిగారికి ఒకానొక సమయమున 30 సం॥వయసులోపే) తీవ్ర అనారోగ్యము తటస్థించినది వైద్యులవలన ఔషధముల వలన ఆవ్యాధి నయముకాక పోయెను.

నిరంతరము భగవచ్చింతన యందే గడపు శ్రీ వేంకటదాసస్వామి వారు "సర్వలాభాయకేశవః "ఏదైనను దైవము వలన కావలసినదే మానవ మాత్రులగు వైద్యులవలననేమగును" నేనాశ్రయించిన నారాయణుని వలన నీకు సంపూర్ణారోగ్యము కల్గించును "భయపడవలదని కుమారునకు ధైర్యము చెప్పి మూడునెలల పదిరోజులు రోజునకు 10వేల చొప్పున రామమంత్రమును జపించి జపఫలమును తీర్థము ద్వారా కుమారునకు యిచ్చిరి. అయిననూ ఆరోగ్యముచేకూరనందున విసుగుచెందక మరొకరీతిలోనాలోచించి ఇష్టఫలదాత ఆరోగ్యప్రదాత శ్రీ నారసింహస్వామియని తలంచి

పెద్దలచేత ప్రేరేపింపబడి శ్రీవేదాద్రినారసింహుని నూఱుసీస పద్యములతో స్తుతించి గ్రంథమును పూర్తిచేసిరి. గ్రంథము పూర్తిఐన వెంటనే కుమారుడు కోలుకొని స్వస్థత చెందెను. ఆ రీతిలో పుత్రునకు సంపూర్ణ ఆరోగ్యమును చేకూర్చి సఫలమనోరథులైరి శ్రీవేంకటదాస స్వామి.

అప్పటినుండి ఈగ్రంథము అనారోగ్యముతో అలమటించుచు సంపూర్ణ ఆరోగ్యమును పొందగోరు వారిచే నిత్యపఠనీయమై అభీష్టములను నెరవేర్చుచున్నది. అనారోగ్య పీడితులగు కుటుంబసభ్యులకు శిష్యులకు నీగ్రంథము నిత్యపారాయణమైనది. ఇది వారి జీవితచరిత్రయగు "తపోమహిమ"లో అంతర్భాగముగా అచ్చువేయబడియున్నది. అంతపెద్ద గ్రంథమును పట్టుకొనుటకన్న చిన్న పుస్తకరూపములోనున్న పాఠకులకు మిక్కిలి ఉపయోగపడునని తలంచి విడిగా అచ్చువేయించుటకు మాతల్లిగారు శ్రీ పద్యాల వేంకటేశ్వర్లు గారి ధర్మపత్ని శ్రీమతి రామబాణమ్మ గారు పినతల్లి శ్రీ తన్నీరు శ్రీరామమూర్తి గారి ధర్మపత్ని శ్రీమతి కమలాదేవిగారు యీ పనికై పూనుకొనిరి. గ్రంథముద్రణ సమయమున దొర్లు అచ్చుతప్పులను సవరించుటకు తమపుత్రసదృశుడగు, శ్రీమాన్ వక్కపట్ల వృషాద్రిపతి గారిని కోరిరి. ఆయన ఆనందముతో నగీకరించి ప్రెస్ వారిని సంప్రదించిరి. ఇటీవలనే తపోమహిమ పునర్ముద్రణగావించిన శ్రీశ్రీ ప్రింటర్స్ (విజయవాడ) అధినేత శ్రీ విశ్వేశ్వరరావు గారు వారి సిబ్బంది అందముగా ఆనందముగ అచ్చువేసి యిచ్చుటకు అంగీకరించిరి.

పాఠకులకు అనుకూలమైనరీతిలో గ్రంథము ఈరూపములో వచ్చుటకు కారణభూతులైన ద్రవ్యదాత్రీమణులను, అక్షరదోషపరిహారకులను, ముద్రాపకులను శ్రీలక్ష్మీ సమేత వేదాద్రినారసింహస్వామి ఆయురారోగ్య భోగభాగ్యములనిచ్చి రక్షింపగలడు.

ఈగ్రంథపారాయణ శ్రీభాగవతమువలె సద్యః ఫలదాయకమై శ్రీతిరుప్పావై అధ్యయనము వలె ఐహికఫలదాయకమై శ్రీ తిరువాయి మొళి అనుసంధానమువలె ప్రారబ్దానంతరము ముక్తిదాయకము అగును. కావున ఈ గ్రంథము పారాయణజేయు భాగవత, భాష్యకార సభ్యులనెల్లరను మా యిలవేల్పగు శ్రీరాజ్యలక్ష్మీరుక్మిణీ సత్యభామా హనుమదాళ్వారాచార్య సమేత శ్రీవేణుగోపాలుడు కటాక్షింప మనోభీష్టములు నెరవేరి ఆరోగ్యవంతులై సుఖింతురుగాక.

(శ్రావణ బహుళ చతుర్దశ హేవిళంబి)
20.8.2017 (భానువాసరము)

ఇటు
భాగవతవిధేయుడు
**గోవిందదాసు**
(శ్రీవేంకటదాసుగారిదౌహిత్రుడు)
(ప. గోపీచంద్రస్వామి)



# శ్రీ వేదాద్రి నారసింహశతకము

శ్రీమన్ నృసింహవిభవేగరుడధ్వజాయ
తాపత్రయోప శమనాయభవౌషధాయ
తృష్ణారివృశ్చిక జలాగ్ని భుజంగ రోగ
క్లేశ వ్యయాయ హరయే గురవే నమస్తే!

సీ. శ్రీకిశ్రీవై ప్రకాశించుటఁజేసి యా
శ్రీ నీ మహిషియై ప్రసిద్ధిఁగాంచె
రామచంద్రుండవై రాజిల్లఁగా లక్ష్మి
సీతావధూటియై చేరి కొలిచె
దేవకీసుతుఁడవై నీవు జన్మింపంగఁ
బద్మ రుక్మిణియై సపర్యఁజేసె
నరసురాద్యాకారధరుఁడవైనప్పుడు
సిరియు నా రూపము ల్చెందికొలిచె
సంపదలకుఁ బృధగ్విధసౌఖ్యములకు
హేతువైన కటాక్షంబుచేత మెలఁగు
భార్గవీదేవి నీ సొమ్ము పరమపురుష
నరమృగాకార! వేదభూధరవిహార! 1

సీ. నిత్యవిభూతిలో నిరతంబు నివసింపఁ గా
మనుష్యులు నిన్నుఁ గానలేక
నాస్తికులై ఘోర నరకకూపములందుఁ
బడిలేవరని కృపాపరుఁడ వగుచు
ధర రామకృష్ణాది వరరూపములుదాల్చి
ధర్మంబు నిలిపి పాతకులఁ జంపి
యా రూపములు మానినప్పుడు జనుల కా
ధారంబులేదని తలఁచి తలఁచి
దేవళములం దిరువులనర్చావతార
మూని సాక్షాత్కరించి సుజ్ఞాను లైన
భక్తులను బ్రోచుచున్నావు పంకజాక్ష
నరమృగాకార! వేదభూధరవిహార! 2

సీ. ఒక్కొక్కచోట నొక్కొక్క సంకల్పంబు
తో వసించితి ఘనార్చావతార
మెనసి యాయా దేశముననుండి సేవించు
వారి బాధ లడంచి కోరినట్టి
సౌఖ్యంబు లొడఁగూర్చి సతతంబు రక్షింపు
చున్నావు తిరుపతి నెన్నరాని
సామర్థ్యమున నిల్చి సర్వదేశస్థుల
నటకు రావించి ద్రవ్యము గడించి
వైభవములందుచున్నావు ప్రాభవాతి
శయము కనిపింప వేంకటేశ్వరుఁడవగుచు
దానిచేఁగాదె ప్రత్యక్షదైవ మనిరి
నరమృగాకార! వేదభూధరవిహార! 3

సీ. ఘన విసారాకార మెనసి సోమకుని ఖం
డించి శ్రుతుల బ్రతికించినావు
తాల్మిఁగచ్ఛపమైసుధను సృజించినిలింప
సముదాయమునకునొసంగినావు
కిటివై ధరను జుట్టు కుటిలాశరుని సంహ
రించి భూతముల రక్షించినావు
రహి నృసింహుఁడవై హిరణ్యకశిపుఁ జంపి
లీలమై ప్రహ్లాదు నేలినావు
వామనాకృతి భార్గవరామరామ
రోహిణీపుత్ర కృష్ణాదిరూపములు ధ
రించి లోకంబులెల్లఁ బాలించినావు
నరమృగాకార! వేదభూధరవిహార! 4

సీ. వరసూరులకు మనోహరములై వెలయు త్వ
దాకారముల కొక హానిలేదు
పలికినప్పుడె మహాపాపంబు లడఁగించు
తావకాఖ్యలకు నంతంబులేదు
కల్యాణదంబులై కనుపట్టు భవదీయ గుణ
గణంబులకు నే కొలఁతలేదు
చెలఁగి సృష్టి స్థితి విలయము ల్సలుపు నీ
సామర్థ్యమునకు నాశంబులేదు
మొనసి దూషించువారి కేజననమందు
నైన సౌఖ్యంబు లేదిసుమంతయైన
నమితమగునట్టి ఘోరదైన్యంబుకలదు
నరమృగాకార! వేదభూధరవిహార! 5

సీ. వరపర వ్యూహాదిపంచవిధాకార
ములచేత వెలయు నిన్నొని కొల్వఁ
దరముగా దర్చావతారంబు దక్క న
న్యాకారములఁ గాంచ నలవిగాదు
దాని నీ వెఱిఁగి భక్తస్తోమములఁ బ్రోవ
నెంచి బంగరు వెండి మంచి రాగి
యిత్తడి రాలచే నేర్పడ్డబొమ్మల
యందున నిల్చి నీ వనవరతము
స్వాశ్రితసపర్యలందినిచ్చలు తదీయ
కాంక్షలు ఫలింపఁ జేసి దుఃఖములవాపి
బ్రోచుచున్నావుగురుదయాంభోధివగుచు
నరమృగాకార! వేదభూధరవిహార! 6

సీ. ఆశ్రితాధీనుండవై వారలెచ్చోట

నిలిపిన నచ్చోటనే వసించి

భక్తితో నేది యప్పనఁజేసినను దత్ప

దార్థంబు మెక్కుచుఁ దనివిలేదు

నాకుఁ జీయనక మన్ననఁజేసి వాహం

నబెక్కు మూరేగుమీ యాపటంబు

ధరియింపుమన్నఁ జెచ్చెర నట్లు గావించి

సద్భక్తులగువారి సంతతంబు

కరుణతోఁ బ్రోచుచున్నావుగాని మాట

లాడనేరవు గౌరవహాని యనుచు

నంతమాత్రముచేతఁ గొఱంతలేదు

నరమృగాకార! వేదభూధరవిహార! 7

సీ. అవసరం బైనప్పు డర్చావతారంబు

నకు మాఱుగా నీవు నరునియందు

నావేశ మొనరించి యైన వేలుపుసాని

యందుండి యైనఁ బ్రియామయందు

గలనైనఁ గన్పడి విలసిత మహిమంబుఁ

దెలిపి రక్షింతు వుత్తలమడంగ

నన్ని దేవళములందున్న దీ మర్యాద

వేంకటాచలమందు విస్తరించి

కానఁబడు నీ ప్రభావమాకారమూని

నట్లు దీని నెఱుంగుదు రఖిలజనులు

మహినిఁ బ్రత్యక్షమునకుఁ బ్రమాణమేల ?

నరమృగాకార! వేదభూధరవిహార! 8

సీ. శిల దేవుఁడాయన చెలఁగువా రఖిల దే
శములందుఁ గలరు ప్రశస్తమైన
తిరుమలయందు నీదివ్యప్రభావ మీ
క్షించినవాఁడు దూషింపలేఁడు
నిందించినట్లైన నిమిషకాలములో వి
పన్నుఁడై ఖిన్నుఁడై బడలియేడ్చుఁ
గోటీశ్వరుండైనఁ గుంభినీపతియైన
బికిరాల మారియై భిక్షమెత్తి
నిలువుదోపిచ్చు ధనము నీ నిలయమందుఁ
జెప్పుదెబ్బలు తానపేక్షించిపొందుఁ
దలఁపశక్యమె యర్చావతారమహిమ
నరమృగాకార! వేదభూధరవిహార! 9

సీ. ఘనశిలామయములై తనరు నొక్కెడదారు
మయములైయొకచోట మహిమఁగాంచు
నారకూటమయంబులైయొక్క చోనొక్క
చోఁ దామ్రమయములై శోభఁగాంచు
నష్టాపదమయంబులై యొక్క చోనొక్క
చో మృణ్మయంబులై సొంపుగాంచుఁ
జిత్రరూపములభాసిల్లునొక్కెడరూప్య
మయములైయొకచోటజయముఁగాంచుఁ
దావకీనాద్భుతార్చావతారములు స
పర్యగాంచును సద్భక్తి పరులచేత
నన్నిమూర్తులయందు నీవున్న కతన
నరమృగాకార! వేదభూధరవిహార! 10

సీ. వేదంబు లద్రియై విపులయందు జనింప
నదియె వేదాద్రియైఖ్యాతిఁగాంచె
వేదవేద్యుండవై విలసిల్లు నీవు త
ద్గిరియందుఁ గరుణచేఁ గెరలి నిలిచి
చెంగటఁజేరి సాష్టాంగ నమస్కార
ము లొనర్చువారి బాముల నడంచి
సకలార్థము లొసంగి సరగునఁ బ్రోచుచు
న్నావని వింటి మానవులచేత
నది నిజంబని నమ్మిత్వదంఘ్రియుగము
నాశ్రయించినవాఁడబ్రహ్లోదవరద!
దీనదశ వాపుమయ్య మహానుభావ,
నరమృగాకార! వేదభూధరవిహార! 11

సీ. రోగముల్బాపి యారోగ్యంబు సమకూర్ప
వేదాద్రిఁగల వేల్పు వెజ్జటంచు
సంతాపములువాపిసంతాన మొనగూర్ప
మననృసింహుండుసమర్థుఁడనుచు
దుర్దశాదుఃఖంబుఁ దొలగించి సిరులీయ
శ్రుతిగిరిస్వామి విశ్రుతుఁడటనుచు
భూతభేతాళాది భీతు లడంప వే
దగిరి లక్ష్మీశుండు దక్షుఁడనుచుఁ
బండితాగ్రేసరులు సర్వపామరులు వ
చింపుచున్నారు నీచెంతఁజేరి ఫలము
లందుచున్నారుగాదె మహానుభావ
నరమృగాకార! వేదభూధరవిహార! 12

సీ. తూర్పుదిక్కునజనస్తోమంబులనుబ్రోవఁ
దలఁచి సింహాద్రిపై నిలిచినావు
దర్శనార్థులఁబ్రోవఁ దలచి యుదీచిది
క్కున ధర్మపురివాస మెనసినావు
వేదాద్రినుండి నానాదేశవాసులఁ
బిలిచి యనిష్టము ల్త్రొలఁచినావు
మా రాష్ట్రమందు సన్మార్గులఁబ్రోవ మం
గళమహీధరమందు నిలిచినావు
యోగనరసింహమూర్తివై యోగియైన
యాంజనేయునితో ఘటికాద్రిపైవ
సించి వినుతించువారి రక్షించినావు
నరమృగాకార! వేదభూధరవిహార! 13

సీ. సింహాచలమునందు శ్రీమదహోబిల
మందు నంతర్వేదియందు ధర్మ
పురియందుఁ జెర్లలో వరమంగళాద్రిపైఁ
గొనబారు సింగ రాకొండయందు
మాల్యాద్రియందున మత్స్యపల్లియయను
నూరిలో మఱియు నల్లూరియందు
ఘటికాచలమునందుఁగాంచీపురమునందు
లలితమౌ బహువిధస్థలములందుఁ
జేరియుండుటఁ జేసి నృసింహరూప
మన్నియవతారములకంటె మిన్నయగుచుఁ
బరఁగుచున్నది కాదె దేవళములందు
నరమృగాకార! వేదభూధరవిహార! 14

సీ. ఆజన్మవైష్ణవుండైన ప్రహ్లాదుండు
జననమాదిగ భవచ్చరణయుగము
నాశ్రయించి భజింప నాతని జనకుండు
పనికిరాదని చెప్పి వినకయున్న
బహువిధ మారణోపాయంబు లొనరించి
దండింపుచుండc బ్రచండనార
సింహరూపమున విచ్చేసి యగ్గాంగేయ
కశిపుని ద్రుంచి నిక్కంపుcగూర్మి
తోcడ బ్రహ్లాదుc గదిసికాపాడినావు
భక్తజనములc బ్రోచుసత్ప్రభుcడ వీవె
సాధుమందార ఘోరసంసారదూర
నరమృగాకార! వేదభూధరవిహార! 15

సీ. పరిఘాతనములదెబ్బలులతాంతములయ్యె
శూలాయుధములు వీచోపులయ్యె
దోమరచ్ఛటలు సంతోషప్రదములయ్యె
బ్రాసాయుధంబు లుల్లాసమిచ్చె
బలుకుఠారంబులుబంధూత్కరంబయ్యెc
గరవాలములు సౌఖ్యకరములయ్యె
శల్యాయుధంబులు జలదమాలికలయ్యె
భిండివాలములు సంపెంగలయ్యె
హేమకశిపుండుమిక్కిలితామసించి
దండన మొనర్చువేళcదత్తనయునందు
నీ కరుణచేత బాధలన్నియు నశింప
నరమృగాకార! వేదభూధరవిహార! 16

సీ. హరిభక్తి మానలేదనుచుఁ బ్రహ్లాదుపైఁ
క్రూరుఁడౌ తజ్జనకుండుగినిసి
గరళంబుదినిపింపఁగా బలప్రదమైన
యాహారమునుబోలె హాయిఁగూర్చె
నున్న తాహార్యమందుంచి క్రిందికిఁద్రోయ,
మంజులశయ్యాసమానమయ్యె
దారుణ వహ్నిమధ్యమునఁ గూల్పింపంగ
బన్నీటిలోనుండు పగిదిఁదోఁచె
బహువిధములగుమారణోపాయములకు
ఖేదమును గాంచదయ్యెఁబ్రహ్లాదసూరి
భవదమోఘానుకంపావిభవమునొంది
నరమృగాకార! వేదభూధరవిహార! 17

సీ. మంటిలోఁబూడ్పించిమఱునాడులేవఁదీ
యగయోగిచందాననెగయుచుండె
నిలఁబెట్టి మేనిపై శిలలు రువ్వింపంగ
నవిలతాంతములట్లు కదియుచుండె
సరవినిశాతపృషత్కంబు లేయంగఁ
దగులక వ్యర్థమై తలఁగిపోయె
నక్షియుగ్మమునకు హానిచేయఁదలంచు
వాని నేత్రంబులు లేనివయ్యె
మారణోపాయములచేత మడియకుండ
నధిక సౌఖ్యముఁగాంచెఁ బ్రహ్లాదసూరి
తావకానుగ్రహముచేత దైత్యవైరి
నరమృగాకార! వేదభూధరవిహార! 18

సీ. కమలసంభవ దత్తగాఢవరంబుచేఁ
దనకు నిధనములేదని మదించు
హేమకశిపుఁ జంపుటెట్లని తలఁచి ని
శాదివంబులుగాని సంధ్యయందు
నార్ద్రశుష్కములచే నాయుధంబులచేతఁ
గాకుండ శాతనఖములచేత
నాకసంబునఁగాక యవనియందునఁగాక
నుతికర్హమైన జానువులమీఁదఁ
జంపవలెనని శస్త్రకస్తంభమందు
ధరణియంతయు భయముచేఁదల్లడిలఁగ
నుద్భవించితి నారసింహుండ వగుచు
నరమృగాకార! వేదభూధరవిహార! 19

సీ. సర్వభూతముల కాశ్చర్యభయములిచ్చు
లాఁగునఁ దగుక రాళంబుతోడఁ
దరణిచంద్రుల కొఱంతలుదీర్చు రుచులచేఁ
దనరారు నేత్రపద్మములతోడ
శతకోటి శతకోటిశితములై ధారచేఁ
గొమారారు తీక్ష్ణనఖములతోడఁ
బ్రావృట్తటి త్కదంబక మయూఖాతీత
మై విలసిల్లు రోమములతోడ
జరుగుకాలత్రయమునవిష్టపమునందు
నెవ్వఁడెఱుగనిరూపుతో నింపుమీఱ
గంబమున నుద్భవింపవే కంజనాభ
నరమృగాకార! వేదభూధరవిహార! 20

సీ. ముజ్జగంబుల భూతముల నేడిపించిన
తన పాప మనుభవంబునకు రాఁగ
ధరసురాసురులలోఁ దన్నుమించినజోదు
లేఁడను విపులావలేపమడఁగఁ
బరమభాగవతుఁడౌ ప్రహ్లాదు దండించు
నధికహింసాకృత్య మడఁగిపోవఁ
గనులార నీరూపమునుఁ జూడనేరక
స్వీయాననంబు వెల్వెల్లఁబాఱ
శౌర్య ధైర్యంబులెల్లను సన్నగిల్లఁ
జేరువను గల హేమకశిపునిముందుఁ
దోఁచినా వుగ్రరూపంబుతోడ శౌరి
నరమృగాకార! వేదభూధరవిహార! 21

సీ. తీక్ష్ణ స్వధితుల ఛేదింప శక్యంబుగా
కుండు శల్యంబులఁ జెండి చెండి
పరిఘాతనములతో సరిదూఁగిపొలుపారు
దోర్దండములనుఁదుత్తుఱుముసేసి
బహుళకఠోరమై పరఁగు విశాల వ
క్షఃకవాటము నిమేషమునఁ జించి
తతతుందమువగల్చి తద్గతాంత్రముల నొ
క్కటలాఁగి జందెంబుగా ధరించి
రక్తమును వెదఁజల్లి హిరణ్యకశిపు
సంహరించిన నీ నఖసంచయంబు
నభినుతించెద దేవ! మహానుభావ!
నరమృగాకార! వేదభూధరవిహార! 22

సీ. సెగకంటిచే మూడుజగముల నేర్చు రు
ద్రాకారచయము ప్రోవైనభంగిఁ
దన వేడిచే సముద్రములఁబీలుచు బాడ
బానలచ్ఛట లేకమైనరీతిఁ
దుదకుననే కాకృతులఁగాల్చు మార్తాండ
బృందమొక్కెడఁగానిపించినట్లు
పైఁజెప్పు మూడురూపము లొక్కచోట వి
శేషంబుగాఁ బ్రకాశించినట్లు
నీవుకంబంబునందు జనించి నార
సింహరూపంబుతోడ భాసిల్లుచుండ
నొక్కరైన నిరీక్షింప నోపరైరి
నరమృగాకార! వేదభూధరవిహార! 23

సీ. తనశకంబిపుడె మాఱునొయంచు భారతీ
వరుఁడుగణించె సంవత్సరములు
స్వీయాధికారంబు చెల్లదోయని నిరు
త్సాహంబుఁగనె మృత్యుదైవతంబు
దండిచింతినిభూతతతినెన్ని పాపముల్
కలవోయని యముండుకలఁతఁ జెందె
స్థూలరూపంబేది యేలీలనుండుమో
యని పంచభూతంబు లార్తిఁజెందెఁ
బూర్ణవిలయంబువచ్చెఁగాబోలుననుచు
వగచెభూతచయంబుసాధ్వసము చేత
నీనృసింహాకృతినిఁ జూచి నిలువలేక
నరమృగాకార! వేదభూధరవిహార! 24

సీ. శ్రీదమైమునిజనాహ్లాదమై సురగణా
మోదమై వెలసె నీముఖ్యతనువు
నయదమై భూరివిస్మయదమై భూతాతి
భయదమై పొసఁగె నీభావపూర్తి
శితములైకాంతిసంయుతములైధారాస
హితములైయొప్పెనద్భుతనఖములు
పరములైరిపుభయంకరములై శ్రితశివం
కరములైచనెరోమగణములెల్లఁ
దావకీన నృసింహావతార వేళ
దాని మహిమంబు వినుతింపఁ దరమె మాకు
నీరజదళాక్ష! శ్రీ భామినీకళత్ర!
నరమృగాకార! వేదభూధరవిహార! 25

సీ. పరిఘ ముద్గర శితప్రాస కుఠారాది
వివిధాయుధములచే నవియకుండ
రవి వారుణాగ్నేయ రౌద్ర విరించాది
దివ్యాస్త్రములచేతఁ దీఱకుండ
శుష్కార్ద్ర పాషాణ క్షోణీమరుత్తోయ
వహ్నిరోగములచే వగవకుండ
దేవతిర్యఙ్నర స్థావరాసుర భుజం
గారి భూతములచే నడఁగకుండ
సరసిజాసనుచే మహావరము లొంది
గర్వమొందినగాంగేయకశిపు జీల్చి
చంపినభవన్నఖంబులు సన్నుతింతు
నరమృగాకార! వేదభూధరవిహార! 26

సీ. సకలాయుధములచేఁ జావులేకుండ వ
రములుగైకొన్న హిరణ్యకశిపుఁ
డాత్మజుఁడైన ప్రహ్లాదుని దండించి
తానీల్గెఁగాని నీదాసుఁడెట్టి
వరము లొందకయున్నఁ బరదైవములప్రాపుఁ
గనకున్న నీ దివ్యకరుణచేత
వెతలులేకుండ జీవించి రాజ్యసుఖంబు
లంది మోక్షమునకు నర్హుఁడయ్యెఁ
బ్రాభవము బాహుబలముసంపదలునన్య
దేవతాశ్రయమొందియు జీవకోటి
నాదరింపఁగలేవు మహానుభావ,
నరమృగాకార! వేదభూధరవిహార! 27

సీ. సకలవేదంబులు సదివి వాగ్జానియై
వర్తించు బ్రహ్మ స్తవంబునైన
సర్వజ్ఞుఁడై సూరిసన్నుతుండై సదా
తులకించు ధూర్జటి స్తోత్రమైన
వాగీశ విఖ్యాతిచే గౌరవముఁ గాంచు
చిత్రశిఖండిజ స్తోత్రమైన
విపులతపంబు గావించి పావనులై పొ
సంగు సన్మునికృత స్తవములైన
లెక్కచేయక ప్రహ్లాదునక్కటికము
మీఱగణుతించినావుచుమీనృసింహ
తనువునొందిననాఁడు గ్రతనొగిమాని
నరమృగాకార! వేదభూధరవిహార! 28

సీ. జలచరములలో విసార కచ్ఛపరూప
ములుదాల్చి కీర్తిచే వెలసినావు
మృగములయందు సమీచీనమగు వరా
హావతారుండవై యలరినావు
మనుజులయందు రామస్వామివై దేవ
కీనందనుండవై కెరలినావు
సురలందు ధారుణీసురులందు వామన
పరశురామాకృతు ల్వడసినావు
మనుజసింహుడవైనూత్న మహిమతోడఁ
గంబమునఁబుట్టిగాంగేయకశిపుఁద్రుంచి
యార్తుఁడగుదైత్యబాలుఁగాపాడినావు
నరమృగాకార! వేదభూధరవిహార! 29

సీ. అలఘు లక్ష్మీనృసింహాఖ్యచే భక్తుల
కెనలేని సౌఖ్యంబు లిచ్చినావు
శ్రీసుదర్శన నారసింహుండవై శత్రు
రింఛోళులను సంహరించినావు
రుచిరసాలగ్రామరూపుండవై కొల్చు
నాశ్రితజనులఁ గాపాడినావు
సిరులీను జ్వాలానృసింహుడవై దాస
కాండాఘవనములఁ గాల్చినావు
పంచవక్త్రాంజనేయుని పాలిట నొక
భాగమై శతకంఠ విభావరీ చ
రుని వధింపించినావు దుర్జనవిదార
నరమృగాకార! వేదభూధరవిహార! 30

సీ. అజరుద్రవాసవాద్యమరులకంటె మ
హాప్రీతితోడఁ బ్రహ్లాదు వినుతి
నంగీకరించి నిజాంకమం దాతనిఁ
జేరిచి యన్యంబుఁ గోరకున్న
రాజ్యం బొసంగి నిరాఘాటమున నేలు
కొనుము నీ వంశమందున జనించు
వారిఁ జంపనటంచు వరమిచ్చి యిచ్చిన
చందాన బలిముఖాశరులఁగూల్ప
కుండ శాంతివహించి యఖండ సత్య
వాక్యమును వెల్లడించితీవసుధయందు
నామయవినాశ! కోటిసూర్యప్రకాశ!
నరమృగాకార! వేదభూధరవిహార! 31

సీ. పటుతరంబుగనీదుసటలు సన్నుతిఁజేయ
వరజటీశ్వరమహత్త్వములభించు
నీరోమసమితి ధ్యానింపఁగా మానస
సంస్థితాజ్ఞానపాశము నశించు
నవవజ్రములఁబోలు నఖరము ల్వినుతింప
నంతర్బహిశ్శాత్రవాళి కెడయు
నీనృసింహాకారమూనినుతింపఁజొ
క్కపుఁబూరుషార్థముల్కలుగుచుండు
నీ రహస్యం బెఱుంగ సంసారబద్ధు
లైన మూర్ఖుల కెప్డు శక్యంబుగాదు
తెలిసికొందురు బ్రహ్మవేత్తలుముకుంద!
నరమృగాకార! వేదభూధరవిహార! 32

సీ. క్షితియందు మున్నుదాల్చిన నీనృసింహావ
తారంబులోకోపకారమయ్యె
నీ నరాహ్వయమును దానొంది గాండీవి
యెల్లలోకములు జయింపఁగల్గె
నీ సింహనామంబుచే సింహముపరాక్ర
మనిధానులకునుపమానమయ్యె
శౌర్యసంపన్నులౌజనులు యౌగికనార
సింహాహ్వయముచేఁ బ్రసిద్ధులైరి
వదనపంచకమందుఁ దావకముఖంబుఁ
గోరికై కొనివాయుకుమారుఁడొగిశ
తాననాసురుఁగూల్చెఁగదాముకుంద
నరమృగాకార! వేదభూధరవిహార! 33

సీ. లెక్కింపరాని బలిష్ఠాశుగములీని
శరులఁగూలుచు భవచ్ఛార్ఙ్గపటిమ
నీ వొత్తినంత ననేకారికామినీ
జఠరపిండములూడ్చు శంఖమహిమ
కర్కశదైత్యరక్తంబుచే నార్ద్రమై
తగునందకాయుధోదారధార
కైటభాద్యసురుల ఖండించి ఘోరమై
తనరు నీ చక్రాయుధ ఖరమూర్తి
క్రూరకౌమోదకీగదాసారదీప్తి
కరరుహంబుల యందుంచికదిసి హేమ
కశిపుఁద్రుంచిన నీపరాక్రమమునెంతు
నరమృగాకార! వేదభూధరవిహార! 34

సీ. తనరుపుణ్యక్షీణమునఁ గూలకున్నచో
భూరి తారలతోడఁ బోల్పవచ్చుఁ
దనయందు నీలలాంఛనము లేకున్నచో
శీతభానుని సరిఁజేయవచ్చుఁ
బరిమితకాంతిచే వర్తింపకున్నచో
దంభోళి కెనయంచుఁ దలఁపవచ్చు
స్థావరత్వమ్ము సెందక యున్నచోఁ దార
శిఖరి సన్నిభమని చెప్పవచ్చు
నట్టిలోపములందు పదార్థముల న
తిక్రమించి వెలుంగు నీదివ్యనఖము
లాత్మలో సన్నుతింతు దేవారిహరణ
నరమృగాకార! వేదభూధరవిహార! 35

సీ. స్వీయవజ్రంబుచే ఛేదింపఁగారాని
బలునిఁ జంపెనటంచుఁ బాకవైరి
లలిఁబాశుపతశూలములకులొంగనిదురా
త్మునిఁజంపెనంచుమృత్యుంజయుండు
సునిశితబ్రహ్మాస్త్రమునకుశక్యముగాని
ఖలునిఁగూలిచెనంచుఁ గమలభవుఁడు
నిఖిలకాలములహానిఁదలంచు దైత్యుఁజీ
లిచెనంచుఁబొంగినిలింపగణము
నీనఖావళిఁగాంచి యనేకగతుల
సన్నుతించిరిగాదె విశ్వాసమొప్ప
నామయవినాశ! కోటిసూర్యప్రకాశ!
నరమృగాకార! వేదభూధరవిహార! 36

సీ. సకలదేహులఁ జంపఁజాలియు నీరక్క
సునిఁ గెల్వనైతినంచు జముదుడ్డు
నూఱువాదరలుండి నుఱుమాడలేనైతి
నసురేంద్రుననుచు వజ్రాయుధంబు
జగములేర్చెడునాకశక్యమయ్యెహిరణ్య
కశిపుచావనుచువాక్కాంతుశరము
ధారాత్రయము గల్గి దనుజు వధింపలే
నైతినటంచు శూలాయుధంబు
పరిభవముఁ జెంది కడు వాఁడిఁబడయఁగోరి
తావకీననఖముల విస్తారభక్తి
తో నుపాసించుచున్నవితోయజాక్ష
నరమృగాకార! వేదభూధరవిహార! 37

సీ. శ్వేతవర్ణంబుచే శివచంద్రకల్పదు
గ్ధాంభోధి శేషసింహములనేలి
రక్తవర్ణంబుచే రవి మహీపుత్రాగ్ని
కోకనదముల నిరాకరించి
తీక్ష్ణధారలచే స్వధితిశూలపవిముఖ
ప్రబలాయుధములచేఁ బన్నులంది
సూక్ష్మాగ్రముచే విశుద్ధకోవిదబుద్ధి
సూక్ష్మసమానమై సొంపుఁగాంచి
వెలయుతావకదివ్యపవిత్రనఖము
లరులసమయించి మమ్ముఁగాపాడుగాక!
చారుమణిహార ఘోరసంసారదూర
నరమృగాకార! వేదభూధరవిహార! 38

సీ. రవిముందు శశిభంగి రవి తోపకుండుట
చే వాసరంబనఁ జెల్లకుండెఁ
బగలింటిచందాన భములు కప్పడకుంటఁ
దరముగాదయ్యె రాతిరియనంగ
నల్పారుణప్రభ లడఁగుటఁజేసి సం
ధ్యాకాల మన వీలుగాక యుండెఁ
బైమూడుకాలముల్కామిభూతచ్ఛట
ల్తాఱుమాఱయ్యె సాధ్వసమునొంది
స్తంభముననుద్భవించియుదగ్రనార
సింహరూపముతోఁ బ్రకాశించునపుడు
వశమె వినుతింప నీ ప్రభావంబు దేవ
నరమృగాకార! వేదభూధరవిహార! 39

సీ. తుదిరేయిఁ దోఁచు రుద్రునకు నతీతమై
రాణించు ఘోరకరాళవిధము
విలయకాలోద్భూతవీతిహోత్రునకున
ధిక విస్మయముఁగూర్చు తిగ్మతయును
బ్రళయకాలార్కబింబమునకు బదులిచ్చు
జాడఁ దోఁచెంచు తేజస్సమృద్ధి
లయవేళఁ బొంగుజలధిసమూహమునక
వార్యమై వెలయు గాంభీర్యగుణము.
కలిగి రాక్షసగోష్ఠిలో నిలిచియున్న
నీ నృసింహాకృతినిఁ గాంచినిఖిలజగము
లచ్చెరువుఁ గాంచెఁగాదె మహానుభావ
నరమృగాకార! వేదభూధరవిహార! 40

సీ. పరులకు విలయార్కుపగిదిదోఁచుముఖంబు
వరపూర్ణచంద్రునివగఁబోసంగె
నన్యులకాభీలమైతోఁచు నీదృష్టి
హిమవారి సోఁకిన ట్లింపుఁగూర్చె
నితరుల కశనియైయెసఁగునీవాక్యంబు
సుధవిధంబున మహాసుఖమొసంగె
లాఁతుల కధికవిప్లవమిచ్చు నీరూపు
నవనిధిరీతి నానంద మొసఁగె
నసురబాలకుఁడైన ప్రహ్లాదునకున్ను
సింహసంహననంబుతోఁ జెలఁగునాఁడు
చారుమణిహారఁ ఘోరసంసారదూర
నరమృగాకార! వేదభూధరవిహార! 41

సీ. సంగీతవిద్యావిచారపారగులై ను
తించు గంధర్వుల ధిక్కరించి
బహుయోగసిద్ధులఁబడసి సన్నుతిఁజేయు
సిద్ధవర్యులఁ గటాక్షింపమాని
చిరకాలమును దపస్సిద్ధినొందిన మునీం
ద్రులపొగడ్తలకు సంతుష్టిఁగనక
ప్రబలసాహిత్యసంపన్నులై కొనియాడు
నాదితేయాళి ననాదరించి
యసురబాలకుఁడైన ప్రహ్లాదు నుడుల
మెచ్చి రాజ్యాధికారంబు లిచ్చినట్టి
భక్తవాత్సల్యమును సదాప్రస్తుతింతు
నరమృగాకార! వేదభూధరవిహార! 42

సీ. సకల నిర్జర నమస్కారము ల్గొనియేలు
శక్రస్తవం బలక్ష్యంబుసేసి
దేవేంద్రునకు గురుండై వాసిఁగాంచు బృ
హస్పతి స్తుతుల ననాదరించి
సర్వజ్ఞుఁ డనెడు యశస్సుచే విలసిల్లు
ధూర్జటిస్తోత్రంబు త్రోసిపుచ్చి
నీనాభియందు జనించి కీరితిఁగన్న
బమ్మ కైవారంబు వమ్మసేసి
యసురబాలకుఁడైన ప్రహ్లాదు నుతికి
సంతసించి వరంబు లొసంగినట్టి
పురువదాన్యత్వసౌశీల్యములునుతింతు
నరమృగాకార! వేదభూధరవిహార! 43

సీ. అతుల సంసారాబ్ధి కావర్తమై యొప్పు
భార్యచే నిడుములు వడయకుండ
జననీజనకులను సంతాప మొందించు
కష్టసంతానంబుఁ గాంచకుండ
భాగార్థమై సదా బాధించుచుండు స
హొదర కలహంబు లొందకుండ
జన్యంబునకు వచ్చు శత్రుసంఘంబుల
నని గెల్చి పరిభవం బందకుండ
మోదముననిల్చి యిరువదియైదువేల
వర్షములు రాజ్యమేలెఁదావకకటాక్ష
లాభవిభవంబుచేతఁ బ్రహ్లాదసూరి
నరమృగాకార! వేదభూధరవిహార! 44

సీ. జనమాంస భక్షణం బొనరించు పాపిష్ఠి
దనుజకులాచారమును దొలంచి
సతతంబు జంతుహింసాకృత్యములచేతఁ
జెలఁగు రక్కసుల శిష్టులనొనర్చి
గాంగేయకశిపుచే భంగమొందిన ముని
శ్రేణి నూరార్చియాశీస్సులొంది
సహజవైరంబుచే సాధ్వసంబొందు దే
వావళితోడ సౌహార్ద్రమొంది
సూరివారముచేతఁ గైవారమొంది
లీలరాజ్యంబు ప్రహ్లాదుఁ డేలెఁగాదె
తానకీనానుకంపచే దేవదేవ
నరమృగాకార! వేదభూధరవిహార! 45

సీ. హరిదాసులగువారి కఖిలలోకములందుఁ
బ్రథమోపమానమై పరిఢవిల్లె
విద్వత్కవీంద్రులై వెలయు పుణ్యాత్ముల
చేత నిరంతరఖ్యాతిఁ గాంచె
నసురవంశోద్భవుండై యుండి బర్హిర్ము
ఖావళిచేత మెప్పందఁగల్గె
సంసారమందుండి సనకాదిమునులతో
నెనయైన వైరాగ్యమును వహించె
సర్వశక్తుండవైన నీ చరణయుగళ
మాశ్రయించుటఁజేసి ప్రహ్లాదధీరుఁ
డామయవినాశ కోటిసూర్యప్రకాశ
నరమృగాకార! వేదభూధరవిహార! 46

సీ. హరులతో రథపరంపరలతో గిరితుల్య
కరులతోఁ బదికశేఖరులతోడ
సిరులతో విబుధప్రవరులతో రాజన్య
వరులతో బంగారుసరులతోడ
హితులతోఁ గన్యకాతతులతోఁ బుత్ర
సంతతులతో సౌభాగ్యవతులతోడఁ
గవులతో మౌనిపుంగవులతో మణి గణ
చ్ఛవులతో నానాసచివులతోడ
రాణఁజెందెను రాక్షస రాజధాని
లీలఁ బ్రహ్లాదసూరి పాలించువేళఁ
దావకీనానుకంపచే దేవదేవ
నరమృగాకార! వేదభూధరవిహార! 47

సీ. ఆయురారోగ్యమహైశ్వర్యములు గాంచి
సతిసుతాదులచేత సౌఖ్యమొంది
నంతర్బహిశ్శాత్రవానీకముల గెల్చి
వర్ణనీయ ప్రాభవము వహించి
భవ్యకర్మజ్ఞాన భక్తి ప్రపత్తుల
చే దక్షుఁడై ప్రజాశ్రేణినేలి
స్వీయబోధార్థ మాసించిన శిష్యస
త్తములకు నీదు తత్త్వంబుఁ దెలిపి
సర్వసౌఖ్యంబులొందె నీచరణయుగళ
మాశ్రయించుటఁజేసి ప్రహ్లాదయోగి
సెందరే కీర్తి తావకాశ్రితజనములు ?
నరమృగాకార! వేదభూధరవిహార! 48

సీ. పచ్చినంజుడు మేయు పలలాశివంశమం
దున జనంచిన జన్మదోషమేది
దనుజులచే స్వీయజనకుండు కోపియై
జరిపించినట్టి హింసలకు నోర్చి
దానవరాజ్యంబు దక్కదేమోయను
ప్రబలసంశయమును బాఱఁదోలి
తమ రక్షణోపాయమును జీవరక్షణ
భారమెట్లనునట్టి భయము విడిచి
నిన్నుఁ గొల్చిన ప్రహ్లాదు నెన్నరాని
కనికరంబునఁ బ్రోచినావనిగదా ని
రంతరము సన్నుతింతు మురప్రమథన
నరమృగాకార! వేదభూధరవిహార! 49

సీ. బ్రహ్మరుద్రాదుల భక్తితోఁ గొల్చిన
రావణ బాణాది రాక్షసాళి
స్వీయ దుర్మార్గంబుచే లోకముల నేడి
పించి పాపముచే నశించి రోలి
నల విభీషణుఁడు ప్రహ్లాదుడు బలిచక్ర
వర్తి రాక్షసులయ్యు వాంఛతోడ
నినుఁగొల్చి సాధువులను కీర్తినార్జించి
ఘనమోక్షమున కధికారులైరి
వారు ముచ్చురు నీ దాసవర్యులగుట
వల్ల సజ్జనులైరి భూవలయమందు
నన్యదానవులం దొక్కఁడైన లేఁడు
నరమృగాకార! వేదభూధరవిహార! 50

సీ. ఇతరదేవతలచే నెన్నో వరములొంది
మత్తిల్లి జగతిపై మాఱులేక
సంచరింపుచు సాధుసంచయంబులను బా
ధించు రాక్షసుల వధింప నీవు
దక్కనన్యులులేరు తత్కార్య మొనరించు
తఱి వరంబులుగాని దైవతములు
గాని రక్షింప శక్యముగాదు దానిచే
సర్వేశ్వరుఁడు సర్వశక్తుఁ డనెడు
బిరుదు నీ కబ్బె నీ పాదసరసిజములు
గొల్చువారికి వేఱు దిగుళ్ళు లేవు
పాపములు లేవు పరిపంథి భయములేదు
నరమృగాకార! వేదభూధరవిహార! 51

సీ. ఆదిదానవులు నిన్ననురాగమునఁగొల్చి
గాఢబలము పరాక్రమముగల్గి
ధర్మాత్ములగువారి దండింపుచుండ స
హింపఁజాలక పార్వతీశుఁ జీరి
తామసరూపంబుఁ దాల్చి నీవు మదీయ
రామమంత్రంబు నిరంతరంబు
జపియింపు మవతారసమయంబులందు ని
న్నర్చింతు గొప్పవాఁడనితలంచి
చేరికొల్తురు దానవశ్రేణు లెల్ల
వారిలో సాధువైరులౌ వారిఁ ద్రుంతు
నని పలికినట్లె దైత్యారి వైతివీవు
నరమృగాకార! వేదభూధరవిహార! 52

సీ. జనులెల్ల నీవారు జంతుసంఘము నీది
జగములకెల్లనీశ్వరుఁడ వీవు
జగమునకు విపత్తు సంభవించెడు పని
చేయనేరవు హాని చేయువారిఁ
జంపుచుండెదవు సజ్జనసమూహంబుల
నెలమితో రక్షింతు వెట్టులన్న
గమఠరూపముచేనగముమోచిపాలసం
ద్రము మథింపించి సుధను సృజించి
దేవతాసంఘములకెల్లఁద్రావనిచ్చి
మనిచియటుపై రుజాజరామరణభయము
లడఁచి రక్షించినావు గదా ముకుంద
నరమృగాకార! వేదభూధరవిహార! 53

సీ. తమసొత్తుగాని జగములెట్టులైన స
రే యనికాదె విరించి రుద్రు
లతిదుష్టులకుఁ గోరినట్లు వరము లీయఁ
బోరిహిరణ్యాక్షుండు భూమిఁజుట్టె
భర్మకశిపుఁడు సద్భక్తుని బాధించెఁ
బంక్తికంఠుఁడు నిరాబార్ల సురుల
సాధ్వుల నేడ్పించె సైంధవుఁడును జరా
సంధుం డొనర్చిరి సాధుజనుల
కపకృతులు వారినెల్ల నీ వంతరింపఁ
జేసి భూభార మడఁచి విశిష్టజనుల
నరసి రక్షించినావు గదయ్య శౌరి
నరమృగాకార! వేదభూధరవిహార! 54

సీ. సర్గాధికారంబు సంహారశక్తి వా
కృతికిఁ బినాకి కిచ్చితివిగాన
నా యిద్దఱెవ్వారి కేయేవరంబు లొ
సఁగిన నాక్షేపంబు సల్పితేని
నధికార గౌరవహానిగదా యని
మాని దుష్టులఁ జంపి మాన్యజనుల
రక్షించెదవు దుర్వరములు గైకొన్న వా
రెదిరించిరేని వారించి త్రుంచి
బ్రహ్మశివుల విపత్తులు వాపి వారి
ప్రాభవము నిల్పుచుందువు పద్మనాభ
సాధుమందార ఘోరసంసారదూర
నరమృగాకార! వేదభూధరవిహార! 55

సీ. సౌభాగ్యవతులై ప్రశస్తసుందరతచేఁ
దులకించు నప్సరసల సృజించి
కామగవీ కల్పక తరు చింతామణీ
ప్రముఖవస్తూత్పత్తి నమరఁజేసి
ఖలజరామరణ రోగముల నివారింపఁ
జాలు పీయూషరస మొదవించి
గంధమాఘ్రాణింపఁగా రుజల్తొలఁగించు
ఘనతరౌషధములఁ గలుగఁజేసి
యెలమితో భక్తులగు వేలుపుల కొసంగి
నావు మందరగిరిమోచి దేవదేవ
తావకౌదార్య మెంతని తలఁపవచ్చు
నరమృగాకార! వేదభూధరవిహార! 56

సీ. సకలలోకముల కాశ్చర్యంబు సమకూర్చు
కచ్ఛపాకార మొక్కట ధరించి
యీరైదువేలపై నేకసహస్రయో
జనమితిగల శిలోచ్చయము వీపు
పై మోసిపట్టి ముప్పదిమూడు కోట్ల దే
వా వాళి నర్వదియాఱుకోట్ల
రాక్షసులను మోచి దీక్షతో వార్ధిమ
థింపించి పీయూషమింపుగా సృ
జించి జన్నంపుదిండ్లకుఁబంచియిచ్చి
నట్టి నీ భక్తవాత్సల్య మభినుతింతు
డింగరాధార సంగరరంగధీర
నరమృగాకార! వేదభూధరవిహార! 57

సీ. శక్రునిగెల్చి యాస్వర్గరాజ్యము బలి
చక్రవర్తి గ్రహింప శక్రజనని
నినుఁగూర్చి తపమొనర్చిన మెచ్చి వరమిచ్చి
ప్రహ్లాదవంశసంభవులఁగూల్ప
నను శాబ్ది చెడఁగూడదని యెంచి వామనా
కారుండవై బలిఁజేరిదాన
మడగి పద్మభవాండ మాకృతిచే నింపి
పాతాళమునకు నబ్బలినిఁ బనిచి
హరికిఁ దమ్ముండవై భాగమడుగకుండ
బెరిమతో దేవరాజ్య మర్పించినాఁడ
వుండునే నిన్నుఁబోలుతమ్ముండు జగతి
నరమృగాకార! వేదభూధరవిహార! 58

సీ. ప్రహ్లాదపౌత్రుఁడై భవదాశ్రితుండైన
బలి నెట్లు వంచింపఁదలఁతు వీవు
స్వర్గాధిపత్యంబు చదలు కాపులకుఁ గా
కర్హంబుగాదు దైత్యాధిపులకు
నని బలీంద్రు నధోభువనమున కనిచి య
ఖండ సంపత్తులు కలుగఁజేసి
చిరకాల జీవియై ధర నేల వరమిచ్చి
వాకిటి కావలివాఁడ వగుచు
నీవు నిత్యంబు బ్రోచుచున్నావుగాని
కీడుసేయవు లోకులీకీలెఱుంగ
లేక దూషించెదరు నిన్ననేకగతుల
నరమృగాకార! వేదభూధరవిహార! 59

సీ. అల దధీచి మునీంద్రుఁ డలఘు శల్యంబిచ్చె
నినపుత్రుఁ డిచ్చె నజినముగోసి
శిబిచక్రవర్తి పక్షికిఁ గండ లర్పించెఁ
గళలిచ్చుఁ బో తారకావిభుండు
నృగుఁడు వస్త్రంబులునగలు గోవులొసంగె
నిలసర్వధాన్యంబులిచ్చుచుండె
శర్వవాణీశులుశాశ్వతవరము లర్పిం
చిరికాదె నక్తంచరులకు
వేలుపులకీవొసంగిన లీలనమృత
మాదరంబున నిచ్చి ఘోరామయములు
జరయుమృత్యువుఁదొలఁగింపఁజాలినారె?
నరమృగాకార! వేదభూధరవిహార! 60

సీ. స్థావరంబగు పారిజాత మహీరుహం
బునకు వదాన్యత్వ మిచ్చినావు
పశుభవంబొంది కన్పట్టు దైవతగవి
కీవుల సామర్థ్య మిచ్చినావు
పాషాణమై పృథ్విఁ బరఁగు చింతామణి
కెనలేని దాతృత్వ మిచ్చినావు
జడభావమున నుండు సంజీవి నామయ
ధ్వంసనశక్తిచేఁ దనిపినావు
జగములకు సృష్టికర్త వీవగుటవలన
నవియ నీవొనఁగూర్చినావని తలంతు
రిక్తులగు నాశ్రితుల నాదరింపవేమి
నరమృగాకార! వేదభూధరవిహార! 61

సీ. భాగీరథిని భవత్పదములఁ బుట్టించి
జీవుల శుద్ధులఁజేసినావు
యమునలో స్నాతవై యందుఁగ్రుంకెడు జన
శ్రేణిఁ బవిత్రంబు జేసినావు
కావేరి మధ్యభాగమున నిల్చి మునుంగు
నట్టి మర్త్యులను గాపాడినావు
వరగౌతమీతటావాసుండవై స్నాత
లగువారి నోమి మెప్పందినావు
తీర్థపాదుండవగుట నదీ సమీప
వర్తివైయుండి త న్నదీవారివారిఁ
జేరి క్రుంకెడువారి రక్షించినావు
నరమృగాకార! వేదభూధరవిహార! 62

సీ. దితి తనూసంభవాధీనంబుఁ దొలఁగించి
సరగున స్వర్గరాజ్యం బొసంగి
విశ్వరూపునిఁ జంపువేళఁ జెందిన బ్రహ్మ
హత్యను బాపి మేలందఁజేసి
కామధేనూకల్పకతరు చింతామణీ
పీయూషములను గల్పించి యిచ్చి
రావణ నరకాది రాక్షసచ్చటలచేఁ
బ్రాపించినట్టి విపత్తు లడఁచి
వాసవుని నీవు రక్షింపవాఁడు పారి
జాతమును నీవు దెచ్చుచో జగడమాడె
నెంత వింతకృతఘ్నుల స్వాంతమకట
నరమృగాకార! వేదభూధరవిహార! 63

సీ. నిర్జరజ్యేష్ఠుని నీ నాభియందీవు
కలిగించి సర్గాధికారమిచ్చి
కైటభమధుసోమకక్షపాచరులచేఁ
దానొందు బాధలఁ దలఁగఁజేసి
సకలశ్రుతులెఱుంగు సామర్థ్య మొనఁగూర్చి
దీపించు వాణీపతిత్వ మొసఁగి
యా బ్రహ్మప్రార్థింపనవనీభరముమాన్పఁ
దలఁచి శ్రీకృష్ణావతారమీవు
సెందినప్పు డెఱుఁగలేక సిగ్గుమాలి
నిను బరీక్షింపవచ్చి హానిఁగని తెలిసి
కొనెననఁగనన్యజనులెఱుంగుదురెనిన్ను
నరమృగాకార! వేదభూధరవిహార! 64

సీ. ఏ విపత్తులయందు సేవించి పిలిచినఁ
బలికి యయ్యాపదల్ దులిచినావు
యే దేశమందుండి ఖేదించి వేడిన
న ప్పీడ నప్పుడే యడఁచినావు!
యేయే పదార్థంబు లెపు డపేక్షించినఁ
బ్రేమతో నిచ్చి తిన్పించినావు
కావలెనంచు నే కార్య మాసించిన
వేగిరంబున నెఱవేర్చినావు
కాని యీనాఁడు మునుపటి కనికరంబు
మానినట్లుంటి వింక నెవ్వానిఁగొల్చి
ఫలముగలిగించుకొందునిప్పనికి దేవ
నరమృగాకార! వేదభూధరవిహార! 65

సీ. వివిధదేశమలందు వివిధరూపములతో
వివిధసంకల్పముల్ వెలయనిల్చి
కనిపించుచున్నావు కాన వైద్యుండవై
కనుపట్టు వీరరాఘవుఁడనీవె
శ్రీరాముఁడవునీవె నారసంహుఁడ వీవె
తిరుమల వేంకటేశ్వరుఁడవీవె
శ్రీరంగపతి వీవె శ్రీకృష్ణుఁడవు నీవె
వరదరాజాఖ్య దైవంబ వీవె
నిన్ను మించిన దైవంబు నన్నుఁబోలు
పాతకుఁడు లేఁడు నేడీ విపత్తునడఁచి
పూని రక్షింపుమయ్య మహానుభావ
నరమృగాకార! వేదభూధరవిహార! 66

సీ. రామరూపమున నారాధింపుచుండఁగఁ
బాలించి కృష్ణరూపంబుతోడఁ
జనుదెంచి దేవళంబున నిల్చి నాపూజ
లంగీకరిచినా వనవరతము
తిరుపతి వేంకటేశ్వరుఁడవై పలుమాఱు
రక్షించినా వనురాగమొప్ప
నిప్పు డొక్కవిపత్తు నెనసి యోజింప నృ
సింహరూపమున విచ్చేసిమామ
కాశయంబున నిల్చి నే డనుసరించి
సన్నుతింపు మనంగ నీ శకతమును ర
చింపుచుంటిని కదిసి రక్షింపుమయ్య
నరమృగాకార! వేదభూధరవిహార! 67

సీ. వేదవేద్యుండవై వేదాంత ప్రతిపాది
తుండవై స్తోత్రప్రియుండవగుట!
వినుతింతునే గాని వేలు లక్ష లొసంగ
స్వాపతేయము లేదు పాపహరణ
స్తవమొనర్చుట కైసఁదగినపాండిత్యంబు
గలవాఁడఁగానునా తెలివికొలఁదిఁ
చేసిన వినుతి విశేషానుకంపాస
మేతుండవై కనుమీ ముకుంద
తప్పులెన్నంగవలదు ప్రధానపురుష
సారమేయంబు నుడుతను సకలగోప
కులను రక్షించినట్లుకైకొనుము నన్ను
నరమృగాకార! వేదభూధరవిహార! 68

సీ. చిత్రకూటాహార్య శిఖరంబునందు వ
సించి పవిత్రంబు సేసినావు
దండకాటవి మునీంద్రస్థానములఁ బ్రవే
శించి యానందింపఁ జేసినావు
ఖలజనస్థానంబుఁ గదిసిఖరాది దై
త్యులఁద్రుంచి మునిబాధఁ దొలఁచినావు
ఘనతరఋశ్యమూకముఁజేరి సుగ్రీవుఁ
డనుభవించెడు దుఃఖ మడఁచినావు
బహుదినంబులనుండి నాస్వాంతమందు
నిలిచి యంగదలడగింప నేర నేమి
కారణమొ వివరింపుమీ కమలనాభ
నరమృగాకార! వేదభూధరవిహార! 69

సీ. జానకీ లక్ష్మణ సహితుండవైనీవు
వనినుండు పదునాల్గు వత్సరము ల
యోధ్యలో సంపత్తులుండియు లేనట్టు
కన్పట్టె నాపదల్కనిరి జనులు
కామినుల్ మోహంబుకనరైరి మగలపై
మగవారు కాంతల మఱచి మనిరి
భోగదానంబులు పొలివోయెఁగేదార
ములశాలిధాన్యంబుపొడమదయ్యొ
నవ్విధంబునఁ దానకీనాంఘ్రిచింత
లేనివారి మనస్సులు జ్ఞానహీన
తను నశించును గాదె సత్వరమెదేవ
నరమృగాకార! వేదభూధరవిహార! 70

సీ. వనినుండి సాకేతమునకు నీ వరుదెంచి
పాలింపఁగానె శుభంబు లొదవె
నినుగాంచువారికినిశయంచుదినమంచు
గాలంబెరుఁగ రాక కడచుచుండె
స్వర్గంబునకుఁబోవసంశయించిరిపుణ్యు
లీ సౌఖ్యమచటలేదేమొ యనుచు
వేలవర్షములు జీవించిరి జను లాయు
రారోగ్యసంపత్తు లతిశయింప
రాజ్యమెల్లను శ్రీరామరామరామ
యనెడుశబ్దంబుచేత మ్రోయం దొడంగె
నీ ప్రభావంబుచేత మనీషివంద్య
నరమృగాకార! వేదభూధరవిహార! 71

సీ. క్రూర దశాస్యసంహారంబు జరిగిన
తరువాత నవ్వనేచరు లయోధ్య
కరుదెంచినీదు పట్టాభిషేకోత్సవ
ము గాంచి యానందమును వహించి
నిను విడనాడి చయ్యనఁ బోవలేక ని
ల్చినఁ గాంచి మిక్కిలి కనికరించి
పాలించి యటుమీఁదఁ బంపించి, మరలర
ప్పించి నీ సన్నిధి నుంచినాఁడ
వట్టి యాశ్రితవత్సలుండైన నీవు
మాకుఁగన్పడవేమి రమాకళత్ర
పాపి వీఁడని దూటితే పద్మనాభ
నరమృగాకార! వేదభూధరవిహార! 72

సీ. ధర్మపాలనఁజేయు ధరణీశ్వరుండు స
జ్జనుల దండించునే సత్యశీల!
పరగృహస్థుఁడు తన్ను మఱఁగి సేవించు ప
తివ్రతన్ విడుచునే ధీరవంద్య
శుశ్రూషఁజేయు శిష్యుని విడుచునె పండి
తుండైన గురుఁడు వేదండవరద!
ఘనగుణాఢ్యుండౌసుతుని వీడునే ప్రాజ్ఞుఁ
డగు జనకుఁడుకై టభాసురారి
యట్లె నీ పాద భక్తుండనైన నన్ను
విడువరాదు, చుమీ వేదవేద్య కృష్ణ
నీ కెఱుఁగరాని దుండునే లోకమందు
నరమృగాకార! వేదభూధరవిహార! 73

సీ. జనని విరోధంబుఁగొని దుగ్ధమీయక
విడువ బాలుండు జీవింపఁగలఁడె ?
పాలిచ్చు గోవు చేపకయున్న వత్సంబు
వేరుచందమున జీవింపఁగలదె ?
బాళిఁ బాలించు కాపరి నిరసింపంగ
నూర్ణాయుసముదయం బుర్వి మనునె ?
పరకృషీవలుఁడు ప్రోవఁగమాసినట్లైన
సస్యంబు పండునే జగతియందు
నట్లె దైన్యంబుగన్న త్వదాశ్రితులను
నీవు మన్నింపకున్నచో నిలువఁగలరె ?
తెలియదా నీకు నిది దేవదేవ శౌరి
నరమృగాకార! వేదభూధరవిహార! 74

సీ. సంకల్పమున గంసుఁ జంపఁజాలియు యశో
దాదేవి కడకేగి దాగనేల
విధికి శ్రుతులు నేర్పువేల్పువైయుండి యా
సాందీపనికడను జదువనేల
సాధువులకుఁ బారిజాతమీవై పారి
జాతార్థమై పోరుసల్పనేల ?
నీ యన్న చంపఁబూనిన మాన్పి యజ్జరా
సంధునకొకసారిజడియనేల ?
తల్లిదండ్రుల చెఱమాన్పి తప్పుసేసి
నాఁడమన్నింపుఁడని కొనియాడనేల ?
ధరణి ఖలజనమోహనార్థంబుగాదె
నరమృగాకార! వేదభూధరవిహార! 75

సీ. జలధి మదాజ్ఞచే వెలయుఁ జుమ్మనుచు వ
చింప ద్వారకను సృష్టించినావు
మలలపై నానతికలదంచు భాషింప
నెంచి గోవర్ధనం బెత్తినావు
శిఖినైనఁగోరి శిక్షింతు నేననుమాడ్కి
దావాగ్ని నొకరాత్రి త్రావినావు
జలదంబులను నేనె శాసింతు ననురీతి
వ్రేపల్లెలో వాన నాపినావు
ధరను సర్వాధికారంబు నెరపుచుండఁ
గొందఱైన నెఱుఁగలేక సందియంబుఁ
జెంది నినుఁ గొల్వలేరైరి యిందిరేశ!
నరమృగాకార! వేదభూధరవిహార! 76

సీ. క్షీరాంబురాశి వసించిన చందానc
బొలుపారు ద్వారకాపురమునందు
నిలిచి తొల్లిటివ్యూహముల నాలుగింటికిc
గర్తనేనని బోధcగఁజపcగోరి
వసుదేవునకుc బుట్టివాసుదేవుండవై
సంకర్షణునితో యశస్సుcగాంచి
తులకించుప్రద్యుమ్నుతో ననిరుద్ధుతో
విలసిల్లినావుపోవేదవేద్య!
యీరహస్యంబనేకులౌసూరివరులె
ఋంగుదుఋగానిమూఢులెఋంగలేరు
గోపికాజార! పలలాశికులవిదార
నరమృగాకార! వేదభూధరవిహార! 77

సీ. వైకుంఠనగర నివాసుండవగు నీవు
తమి గొల్లపల్లెలోc దాగినావు
వరనిత్యముక్తనిర్వాహకుండగు నీవు
గోపార్భకశ్రేణిc గూడినావు
శివశక్రవిధుల శాసింపుచుండెడు నీవు
కడువేడ్క గోవులc గాచినావు
లక్ష్మి వధూమణీ లాలితుండగు నీవు
గోపాంగనల పొందుc గోరినావు
కాని యీనాటి కిడుములcగాంచలేక
వేడుకొనుచున్ననన్నుc గాపాడవైతి
వేమి హేతువౌ సౌశీల్యమెచటికేగె ?
నరమృగాకార! వేదభూధరవిహార! 78

సీ. నవరత్నహారము ల్సవరింప మాని గుం
జాహారములు గళస్థములుసేసి
మణికిరీటము పెట్ట మాని మయూరశి
ఖండంబు నిజమస్తకమునఁ దాల్చి
శంఖచక్రాది ప్రశస్తాయుధము లేది
శృంగవేణువులు వాసిగ ధరించి
గొనబారు బంగారు కుండలంబుల వీడి
యిందీవరము వీనులందుఁ జెరివి!
క్రమకుంతలములు నీ ముఖమునఁబర్వ
నడవులందుఁజరించరహస్య మేమొ
యనఁగ సద్భక్త వాత్సల్యమని తలంతు
నరమృగాకార! వేదభూధరవిహార! 79

సీ. బర్హిర్ముఖుల కలభ్యంబైన తావకో
చ్ఛిష్టాన్నమును సంతసించి మెక్కి
గమనించువేళమార్గమునసహాయులై
కడువేడ్క మెడమీఁదఁగరములుంచి
కూడిపెల్లుగ నాటలాడునప్పుడు పర
స్పరమైత్రి పచరించి పర్వులెత్తి
చిగురాకు గములతో సెజ్జలు గావించి
యందునీవు శయింప నడుగులొత్తి
చనువుమీఱంగ నీ తోడఁ జల్దులార
గించినట్టి వ్రజార్భక సంచయముల
భాగ్యమింతని వర్ణింప, బ్రహ్మవశమె
నరమృగాకార! వేదభూధరవిహార! 80

సీ. నిశలందు గోపికల్ నీ సన్నిధానంబుఁ
బ్రాపించి దర్శించి బాళిమీఱఁ
దమచుంబనములచేఁ దనివిఁగల్గించి నీ
చుంబనంబులచే ముదంబుఁగాంచి
నీ కౌఁగిటమెలంగి నీతోడరతికేళిఁ
గావించి నీపాదకమలయుగము
స్తనములమోపి దంతక్షతంబులు రద
నక్షతంబులు నీవొనర్పఁబొంగి
నీదుపరిహాసవాక్యంబు లాదరించి
సంతసించిన వల్లవీజనసమాజ
భాగ్యమెన్నంగశక్యమా పద్మనాభ
నరమృగాకార! వేదభూధరవిహార! 81

సీ. వల్లవీరత్నంబులెల్ల నీదటిఁజేరి
కైకొన్న భూరిభోగముఁదలంప
ముసు దానములొనర్చి యెనసినారన్నచో
బహువదాన్యుల కిట్టిప్రాప్తిలేదు
చిరకాలపుణ్యంబుచే నొందిరన్నచో
సుకృతవంతులకు నీశోభలేదు
ఘనతపఃఫలముచేఁ గాంచినారన్నఁ దా
పసుల కీయానందపదవిలేదు
కారణములేని నీ యపాంగ ప్రసార
బలముచే నిట్టి సౌఖ్యసంపత్తి కర్హ
లైరని వచింపవచ్చు సంసారదూర!
నరమృగాకార! వేదభూధరవిహార! 82

సీ. ఏబదివేలపై నెన్నంగమూడుల
క్షలసంఖ్యచేత గోకులమునందుఁ
దనరారుగోపకామినులతో సంభోగ
మొనరించి వీర్యస్ఖలనముగాని
మహిమతో వర్తించి మహిళామతల్లులఁ
దనివిజెందించి సంతానమునకు
దూరంబుసేసి సంసారభీతిఁ దొలంగఁ
జేసి మోక్షార్థులఁ జేసినాఁడ
వక్కతంబునఁగాదె నిన్నఖిలసూరు
లస్ఖలితవర్ణి యనిపల్కి రవనియందుఁ
బావనాకారధీర కృష్ణావతార
నరమృగాకార! వేదభూధరవిహార! 83

సీ. మహిలోన మున్నెంతమందియో కాముకు
లాసచే వేలభార్యలగడించి
సంభోగమునఁ దృప్తిసమకూర్పలేక సం
తాపమొందించి ఖేదమువహించి
రటుగాక నీవు జాయలఁ బదియార్వేల
పైదచ్చి యిల్లాండ్రఁబడసితెచ్చి
ప్రతిదినంబును బ్రతిభార్యతో భోగించి
యేకకాలమున ననేకదివ్య
దాకృతులుదాల్చిదారలకందరాని
సంతసముఁగూర్చినావట్టిచరితమెన్ని
బ్రహ్మవేత్తలు నినుబరబ్రహమ్మనిరి
నరమృగాకార! వేదభూధరవిహార! 84

సీ. అఱునూఱుమందిజాయలతోడనన్నిరూ
పములుధరించి సౌభరిమునీంద్రుఁ
డందఁడే భోగంబులన్నఁ దపోవ్యయంబగు
దాఁక నటుసల్పి యంతమీఁద
వగచి దైన్యముఁజెంది వనికేగి మరలఁద
పంబుఁగావించె నబ్బంగి దుఃఖ
మందక బాల్యంబునందు గోపికలతోఁ
గ్రీడించి తరువాతఁ గీర్తిఁగన్న
రాజకాంతలతోడ విరాజమానుఁ
డగుచు భోగించి సౌఖ్యంబులందినావు
దైన్యమునుబొందవైతిగదామురారి
నరమృగాకార! వేదభూధరవిహార! 85

సీ. నీ దాసులగువారు నిఖిలకాలములందు
నుండిరిగాని యీయుర్వియందు
వ్రజభామినులవంటి భక్తిగల్గినవారు
బూరి సంఖ్యాకులౌవారు దొరక
రక్కారణమున గదయ్య శుకుండుమో
క్షార్థియై తగునుత్తరాత్మజునకుఁ
జరమఘస్రమునందుఁ జర్చించి గోపికా
వార్తలు దెల్పి తద్వాంఛఁదీర్చె
సులభముగ ముక్తిఁగైకొనఁదలఁచువారు
వల్లవీరత్నముల దివ్యవర్తనంబు
విని పఠించినఁజాలు వివేకమొప్ప
నరమృగాకార! వేదభూధరవిహార! 86

సీ. అజుఁడ వీవయ్యు ననంతరూపములచే
జనియింపుచున్నాఁడ వనవరతము
క్షుత్పిపాసాదులించుకలేని ఘనుఁడవై
స్వీకరించెదవు నైవేద్యములను
విశ్వమయఖ్యాతి వెలుగొందు ఘనుఁడవై
లలి నిల్చినావ దేవళములందు
వాతశీతోష్ణాది బాధలేకుండియుఁ
దాల్చుచుంటివి పరిధానములను
ధరణియందున నర్చావతారమొంది
భక్తవరుల కఖిలసంపత్తు లొసఁగి
వంతలడఁగించుటకుఁగాదెవాసుదేవ
నరమృగాకార! వేదభూధరవిహార! 87

సీ. శుంభదావరణస్థితాంభస్సులట్లుప
రస్వరూపము కానరానిదయ్యె
వాసుదేవాది సర్వవ్యూహములు కానఁ
బడవు దుగ్ధాబ్ధిశంబరములట్లు
భవ్య రామాది విభవములు గోచరిం
పవు మానసతటాకభువనముగతిఁ
దనుధారులందు నంతర్యామివైయుంట
తెలియ దుర్వీగతజలమురీతి
నట్టులగుకారణమున నీ వర్చనార్హ
మైనరూపంబుతోడఁ బ్రత్యక్షమై జ
నావళులఁ బ్రోచుచుంటివహోముకుంద
నరమృగాకార! వేదభూధరవిహార! 88

సీ. గాంగేయపాషాణ ఖర్జూరతామ్రమ
యాకారములతో మహత్త్వఁగాంచు
తావకీనార్చావతార సంస్థితసుప్ర
భావంబుఁ గనలేక ప్రతిమలని య
చేతనంబులటంచుఁ జింతించి నానావి
ధాపచారములు నిత్యంబొనర్చి
చెడిరికొందఱు ముందుఁజేటుగాంతురునేడు
చెడపోవుచున్నారు కడిఁదిమగలు
కాని దేవాలయములందు ఘనగృహంబు
లందు నీబేరములునిల్పియధికభక్తిఁ
గొలుచువారిహపరసౌఖ్యములనుగనిరి
నరమృగాకార! వేదభూధరవిహార! 89

సీ. కూర్మితో భద్రాద్రిగోపన్న బొమ్మచే,
నాలుగులక్షలవరహాలు గాంచె
గొనబారు సుల్తాను కూఁతు రారాధింప,
నలరుసెల్వప్పిళ్ళవలపుదీర్చె
భావనారాయణస్వామి పొన్నూరిలో,
గూనిగోవిందునికొఱకు నిల్చెఁ
బుండరీకునికినైయుండెఁగదా చంద్ర,
భాగాతటమునందుఁ బాండురంగఁ
డట్టిమూర్తులు నీవేగదయ్య దేవ,
నారసింహాహ్వయముఁగాంచినావుగాని
తలఁపశక్యమెయర్చావతారమహిమ,
నరమృగాకార! వేదభూధరవిహార! 90

సీ. తిరుమంగయాళ్వారు వరశిష్యజనులతోఁ
గలిసి శ్రీరంగ కైంకర్యమునకు
ధనములేదని దొంగతనము గావింపుచు
నూరూరఁదిరిగి సొంపార దోఁచి
వేలు లక్షలు వరహాలు బంగారంబుఁ
గొనివచ్చినాఁడు కైకొనిన విఘ్న
బాధలఁదొలఁగించి పరకాలసూరి ని
ర్మితమైన కోవెలమేడలందు
వాసమొనరించిదర్శించువారిఁబ్రోచు;
భూరివైభవమునుగాంచిబొమ్మయనెడి
భావమున నిరసించునే పాపియైన
నరమృగాకార! వేదభూధరవిహార! 91

సీ. నీ నాభియందు మాణిక్యం బమోఘమై
దీపింపగా బెరుందేవితోడ
భుజచతుష్టయముతోఁ బొలుపారు శంఖచ
క్రములతో లసదపాంగములతోడ
బావనార్చకులతోఁ బరమవైష్ణవులతో
వేదముల్వల్లించు ద్విజులతోడ
హస్తిశైలాగ్రమం దఖిలదేశస్థులౌ
జనులు సేవింపఁ బ్రశస్తరీతిఁ
బరఁగునీ వైభవముఁగాంచునరుఁడు దేవుఁ
డనకనిరసించునేవిగ్రహంబటంచు
డింగరాధార దురితప్రసంగదూర
నరమృగాకార! వేదభూధరవిహార! 92

సీ. శతకోటిధనముతో, శతకోటిజనులతో
వరపరిచారకవ్రజముతోడ
భర్మగోపురలసత్ప్రాకార మంటపా
వళులతో నుద్యానవనులతోడ
సాధుసంఘములతో సన్మునిచ్ఛటలతోఁ
బెరసిపూజించు జియ్యరులతోడఁ
బ్రతిదినంబునువచ్చు భర్మరూప్యములతో
మణులతో సుందరీమణులతోడ
నిరతమువెలుంగు వేంకటేశ్వరునిబొమ్మ
యనివచించునెయెంతదురాత్ముఁడైన
దేవ!శేషగిరీశుండ వీవెకావె
నరమృగాకార! వేదభూధరవిహార! 93

సీ. శ్రీభద్రగిరిలోవసించు రాఘవుఁడొక్క
గండంబుఁదొలగించికాచినాఁడు
కరిగిరీశుండైన వరదుండు మున్నుఘో
రాపత్తుఁదొలఁచి కాపాడినాఁడు
వేంకటేశ్వరుఁడుమున్వేలధనంబు ని
ప్పించి కార్యంబు సాగించినాఁడు
శ్రీవేణుగోపాలుఁ డీ వీట నివసించి
వివిధక్రియలు నెఱవేర్చినాఁడు
వారి నాసింపమాని, నీవలన నొక్క
మేలుసెందఁదలంచి యీలీల శతక
మాదట రచించినాఁడఁ బ్రహ్లాదవరద!
నరమృగాకార! వేదభూధరవిహార! 94

సీ. నే దలంచినపని నీ వెఱుంగనిది కా
దైన వక్కాణింతునయ్య వినుము
పండితుండైన నా పట్టి మూడవవాఁడు
దాశరథిఖ్యాతిఁ దనరుచుండు
నతనికి గుండెలో నామయంబు జనించి
శ్రమనొందఁజేసె వత్సరమునుండి
యెన్నిమందులు మెక్కుచున్నఁ దచ్ఛాంతిక
ల్గకయుండె నీవనుకంపతోడ
రోగమునశింపఁజేసియారోగ్యమొసఁగి
బలమువాక్పాటవంబుసంపదలనిమ్ము
వానికిచ్చుటె నాకిచ్చువరముచుమ్ము
నరమృగాకార! వేదభూధరవిహార! 95

సీ. శ్రుతిగిరియందు నిల్చుటలాదిగా నెంత
మంది విపత్తులు మాన్పినావొ
ఘనవాంచితార్థంబులొనఁగూర్చుచున్నావొ
యెఱుఁగనుగానిమున్నెఱిగినంత
వఱకుఁ దెల్పిన వారి వాక్యంబు లాలించి
నమ్మినుతింపుచున్నానుగానఁ
బ్రహ్లాదుని విపత్తుఁబాపి రాజ్యంబుని
చ్చియు సతతంబు రక్షించినట్లు
తావకీనాంఘ్రిదాసుని దాశరథినిఁ
జేరి యాతని గుండెలోఁజేరి కలఁచు
దేహరోగంబుఁ బాపవే దేవదేవ
నరమృగాకార! వేదభూధరవిహార! 96

సీ. వివిధనిర్జరుల సేవించుటమాని నీ
శరణాగతుండనై పరగినాఁడఁ
బొలుపారు ధారక పోషకభోగ్యంబు
లన్ని నీవని నమ్మియున్నవాఁడ
సాధనాంతరవాంఛఁ జాలించి నీదయా
లాభంబునొందఁదలంచినాఁడ
జనకుఁడాచార్యుండుజనని దైవముధాన్య
ధనములీవని సదా మనమునందు
విశ్వసించినవాఁడ దర్వీకరేంద్ర
తల్ప! శ్రీరామ! వైకుంఠధామ! కృష్ణ!
మంగళములు విహంగతురంగ నీకు
నరమృగాకార! వేదభూధరవిహార! 97

సీ. శరణన్నవారి రుజల్ నశింపించిన
వీరరాఘవుని రావించి నిలిపి
ప్రార్థించువారి విపత్తు లడంగించు
శేషాద్రినాథునిఁ జేరఁదీసి
సాగిమ్రొక్కినవారి రోగముల్పోగొట్టు
సామి మాల్యగిరీశు నామతించి
యాశ్రితజనులఘోరామయంబులువాపి
మనుచు మంగళగిరీశునొగిఁబలిచి
యుంచి మీరందతేకీభవించిమామ
కాత్మజునిరుజఁదొలఁచిమహానుకంప
తోడనారోగ్యమిమ్ముసంతోషమొప్ప
నరమృగాకార! వేదభూధరవిహార! 98

సీ. జారత్వదోషంబుచే రాయియైన సం
యమివధూ శాపంబు నడఁచినావు
పరిమళ ద్రవ్యమర్పణఁజేసి నంతలో
వెలఁది కురూపంబుఁ దొలఁచినావు
స్వల్పదోషమున నూసరవెల్లియైన నృ
గుని పాతకంబు బోగొట్టినావు
బ్రహ్మదత్తుఁడు గృధ్రభవమొందఁ గా దొలం
గించి సుందరునిఁ గావించినావు
కాని మాకార్య మంతదుష్కరముగాదు.
నీకటాక్షంబు సోఁకిననిమిషమందు
గలుగు నారోగ్యపూర్తినిక్కముముకుంద,
నరమృగాకార! వేదభూధరవిహార! 99

సీ. ఆరోగ్యమొనఁగూర్చు నాదిత్యుఁడందు ర
య్యాదిత్యు తేజస్సు నీదెకాదె
విషధరారాతియై వెలయు నీడోద్భవ
నాధుండు నీ వాహనంబుగాదె
సంజీవిరాయఁడై సతతంబు జగతిపైఁ
దులకించు హనుమ నీదూతగాఁడె॥
చావులేకుండ నస్వప్నులకిచ్చిన
సుధ యరయంగ నీసొత్తుగాదె
స్వామి నీవిట్టివాఁడవై స్వల్పరోగ
మేలపోగొట్టలేవు దయాలవాల
నీ మహిమ నీకుఁదెలియదే నీరజాక్ష!
నరమృగాకార! వేదభూధరవిహార! 100

సీ. సర్వభూత భయంబు సడలింతునే నాశ్రి
తావళికన్న రామాయణోక్తి
నా భక్తునకులేదు నాశనంబనుచు
నీవనిన గీతాశాస్త్రజనితసూక్తి
సర్వలాభముల గేశవుఁడిచ్చునని భూమి
సతతంబు విలసిల్లు సద్వచస్సు
భవదీయులిలఁబరాభవమునొందక లాభ
జయములొందుదురన్న శాస్త్రవాక్కు
సత్యమగునట్లు మాదుర్విషాదమును దొ
లంచియారోగ్యమిమ్ము విరించి జనక
తామసింపక రక్షింపు మోమురారి
నరమృగాకార! వేదభూధరవిహార! 101





ద్రవ్యదాతలు :

విదుషీమణులు

శ్రీమతి **పద్యాల రామబాణమ్మ** గారు

శ్రీమతి **తన్నీరు కమలాదేవి** గారు

గ్రంథకర్త పరమహంస శ్రీ వేంకటదాస స్వామి వారి కుమార్తెలు